# రామకృష్ణజంత్రి.

ఇది 1, 2, 3 భాగముల వకేబైండు. ఇందులో ఎన్ని సెంట్లకుగాని యెన్ని యెకరములకుగాని యేరేటులో కావలసినను శిస్తు వివరముగా తెలుసుకొనుటకున్ను, యూనిట్ రేట్లకు కావలసిన వివరములున్ను, జీతములు, పెన్షనులు, యింటిఅద్దెలు మున్నగునవి యేనెలలో యెన్నిరోజులకు కావలసినను అవి మిక్కిలి సులభముగా తెలిసికొనుటకు ఉపయోగకరమైన గ్రంథము. ఇది గ్రామ కరణములకును, మునసబులకును, రివిన్యూ ఆఫీసరులకును, తదితరులకును ముఖ్యముగా చేతియందుండదగినదై యున్నది. ఇటువంటి పుస్తకము యిదివరకెన్నడును యెవరును తయారుచేయించి యుండలేదు. కొద్దిప్రతులుమాత్రమే అచ్చువేయింపబడి యున్నవి. త్వరలో ఆర్డర్లు పంపినవారికే దొరకును.

వెల పుస్తకము 1కి రు 1—8—0 మాత్రమే.

వలయువారు:—రామా అండ్ కో.,
ఎడ్యుకేషనల్ పబ్లిషర్సు,
తర్లపాడు, నెల్లూరుజిల్లా.

# ఆర్యకథాలహరి

## మూడవ భాగము

గ్రంథకర్త:
టి. వి. నరసింగరావు, బి.ఎ.,
డెప్యూటి ఇన్స్పెక్టర్ ఆఫ్ స్కూల్సు,
నంద్యాల రేంజి.



ప్రకాశకులు:
రామా అండ్ కో.,
విద్యావిషయికప్రచారకులు,
[illegible]

# విషయసూచిక.

—— :o: ——

# ఆర్యకథాలహరి.

## మూఁడవ భాగము.

### 1. బాలతాపసి.

శ్రీహరిపై భక్తి యలవడుట మిగుల కష్టము. దృఢమైన దైవభక్తితో నెట్టి కార్యమునైన సాధింపవచ్చును. మనలను సృజించిన యా పరమేశ్వరునకు వయస్సుతోఁ బనిలేదు. చిన్నవారైనను, పెద్దవారైనను భక్తిపరులే దేవునికి పరమప్రియులు. తను నమ్మినవారిని శ్రీహరి తప్పక రక్షించును.

పూర్వము ఉత్తానపాదుఁడను రాజు "ధర్మమేజయ" మను వాక్యమనుసరించి రాజ్యమేలుచుండెను. అతనికి సునీతి, సురుచియను నిరువురు భార్యలుండిరి. సునీతికి ధ్రువుఁడు, సురుచికి నుత్తముఁడు నను కొడుకులుపుట్టిరి. వారు దినదినమున్వృద్ధిబొందుచుఁ దల్లిదండ్రుల కెక్కువ సంతోషము కలిగించుచుండిరి. ఉత్తానపాదునకు తన చిన్నభార్యయగు సురుచియం దెక్కువప్రేమ యుండెను. ఆతఁడెప్పుడును నామె యింటియందే కాలము గడపుచుండెను. ఒకనాఁడాతఁడు సురుచికొడుకగు నుత్తమునిఁ దనతొడపైఁ గూర్చుండఁబెట్టు

కొని ముద్దులాడుచుండెను. ఆ సమయమున వచ్చుటికి ధ్రువుఁడు వచ్చెను. ధ్రువునకుఁగూడఁ దన తండ్రితొడపైఁ గూర్చుండుటకుఁ గోరిక పుట్టెను. వెంటనే యాతఁడు సంభ్రమముతోఁ దండ్రిని సమీపించెను.

ఆ ప్రక్కనేయున్న సురుచి ధ్రువునిఁజూచి యిట్లు పలికెను. "ఓ సవతికొడుకా! నీసంబరమునకుఁ గారణము నాకుఁ దెలిసినది. నీ తండ్రితొడపైఁ గూర్చుండు భాగ్యము నీవు నోచుకొనలేదు. అట్టిదియున్నచో నా కడుపుననే పుట్టియుందువు. ఇప్పుడైనను నీవట్టి భాగ్యము కోరుదువేని లోకరక్షకుఁడైన శ్రీహరిని సేవింపుము." ఇట్లుచెప్పి యామె యా కుమారుని చేయిఁబట్టుకొని యావలకు లాగెను. ఉత్తానపాదునకుఁ గొడుకునందుఁ బ్రేమయున్నను సురుచిమాట కెదురు చెప్పఁజాలక యూరకుండెను.

అవమానము భరించుట మిగుల కష్టము. అది అగ్నికంటె వేడి. ఖడ్గముకంటె వాడి. సవతితల్లిమాటలకు ధ్రువునికన్నుల వెంట నీళ్ళువచ్చెను. అతఁడేడ్చుచు దల్లియగు సునీతికడకు బోయెను. సునీతి కొడుకునోదార్చుచుఁ దొడపైఁ గూర్చుండఁ బెట్టుకొని దుఃఖమునకుఁ గారణమడిగెను. ధ్రువుఁడు తన్ను సురుచియాడిన మాటల నెఱింగించెను. ఆ పలుకులు విని సునీతిగూడ దుఃఖించి కుమారునకిట్లనెను. "తండ్రీ! నీ వేడ్చి

నందువలనఁ బ్రయోజనములేదు. నేను సురుచిచేత దాసికంటెఁ గడు నీచముగఁ జూడఁబడుచున్నాను. నిర్భాగ్యురాలనగు నాకడుపుననీవుపుట్టితివి. నాకుఁ బుత్రుఁడవగుటచేతనేనిన్నామె యన్నిమాట లనఁగలిగెను. అయినను నీకామె మంచి యుపకారమే చేసెను. నీ వామె చెప్పినట్లు శ్రీమన్నారాయణుని సేవింపుము. ఆతనికంటె నీదుఃఖమును బోఁగొట్టు సమర్థు లెవ్వరును లేరు. ఆతని సేవయిహలోకసుఖములనేగాక పరలోక సుఖముగూడనిచ్చును.''

ధ్రువుఁడు తల్లి చెప్పిన మాటలు విని యామెకు నమస్కరించి, యాశీర్వచనముబొంది హరింగూర్చి తపస్సుజేయుటకు బయలుదేరెను. ఎక్కడికి బోవలయునో యాతని కేమియుఁ దెలియదు. అట్లు పోయిపోయి యాతఁడొక భయంకరమైన యడవిలోఁ బ్రవేశించెను. అప్పుడు నారదమునీంద్రుఁడా బాలునకుఁ గనఁబడెను. బాలకుఁ డా మునీంద్రునకు నమస్కరించెను. ధ్రువునిసంగతి దివ్యదృష్టిచే గనిపెట్టి నారదుడతనినిఁ జూచి “నాయనా! నీసంగతి నేను తెలిసికొంటిని. నీవు చిన్నవాఁడవు. ఒంటిగా నెక్కడికిఁ బోయెదవు? మీయిల్లు కావలసినపాడిపంటలతో నిండియున్నది. అవియన్నియు విడిచిపోవుట మంచిది కా”దనెను. అందులకు ధ్రువుఁడు “మునీంద్రా! సవతితల్లియాడిన మాటలుసహింపలేక హరింగూర్చి తపముసేయుటకుఁ బోవుచున్నా”నని పలికెను. నారదుఁడు

నవ్వి "నీవు పసివాఁడవు. ఈవయస్సునమానావమానములుండ రాదు. నీవెక్కడ? శ్రీమన్నారాయణునిఁగూర్చితపము జేయు టెక్కడ? తపస్సుఅనఁగాసామాన్యమనుకొంటివా? ఎండవానల కోర్వవలయును. చలికిసహింపవలయును. అదియుంగాక పెద్ద కాలముతపస్సుజేయు మునీశ్వరులే శ్రీహరినిజూడలేక యుందురు. నామాటవిని యీ కోరికవిడిచి యింటికిబో" మ్మనిఁ జెప్పెను.

ధ్రువుండందులకు సమ్మతింపలేదు. "ఎన్నికష్టముల నైనఁబడి శ్రీహరిని జూడఁదలఁచితిని. అతని యనుగ్రహము బొందకుండఁ బురమునకు మరలిపోవను. నాయందు దయ యుంచి యా మహాత్ముని సేవించుమార్గము జెప్పు"మని యా బాలుఁడు నారదునిబాదములపైబడి వేడికొనెను. నారదుఁ డాకుమారునిబుద్ధికి సంతసించి శ్రీహరిమంత్రము నుపదేశించి "కుమారా! కనుచూపుమేరలో మధువనమున్నది. అక్కడనే యమునానదిగూడ నున్నది. అయ్యది తపస్సుజేసికొనుటకుఁ దగినస్థలము," అని చెప్పెను.

ధ్రువుడు నారదుఁడు చెప్పినట్లు మధువనమునకుఁబోయి హరిం గూర్చి తపస్సు జేయుచుండెను. ఆతఁడు కొన్ని దినము లడవిపండ్లను దినెను. కొన్నిదినములు జలముమాత్రమే త్రాగెను. కొన్నిదినములేమియుఁ బుచ్చుకొనకయుండెను. ఇట్లాతఁడాఱుమాసములు శ్రీహరికై ఘోరమైనతపము జేసెను.

ఆతని తపమునకు శ్రీహరి సంతోషించి ప్రసన్నుఁడై యనేక వరములిచ్చెను. ధ్రువుఁడు మిక్కిలియానందముతో నిజపురమునకు వచ్చెను. ఉత్తానపాదుఁడు కొడుకుతేజమునుజూచి యాశ్చర్యపడెను. తనకొడుకింతవాఁడయ్యెఁగదాయని సునీతి సంతసించెను. సురుచి సిగ్గునొందెను. ఉత్తానపాదుఁడు ధ్రువునకే రాజ్యాభిషేకముజేసి తపమునకుఁ బోయెను. ధ్రువుఁడనేక సంవత్సరములు రాజ్యపరిపాలనముఁజేసి, హరికరుణచే స్వర్గమున నందఱికన్న యున్నతపదవి గాంచెను.

బాలులారా! చూచితిరా! వయస్సున బాలుఁడైయును ధ్రువుఁడు తనదృఢసంకల్పముచేతను, నిశ్చలమైన హరిభక్తిచేతను నెట్టి యున్నతపదవిఁ బడయగలిగెనో! మీరును భక్తిపరులైనచో సమస్తకార్యములందును మీకు దైవము తోడ్పడును. మీకు పరమేశ్వరుఁడు తోడునీడయైయుండి మిమ్ములను సదా రక్షించును.

---

## 2. గర్వభంగము.

పూర్వకాలమునఁగూడఁ ననేక వీరాగ్రేసరులుండిరని మనకుఁ బరశురాముని కథవలనఁ దెలియును. ఈతఁడేగాక ద్రోణుఁడు, కృష్ణుడు, అశ్వత్థామ మొదలగువారెందరో

కలరు. పరశురాముఁడు జమదగ్ని యను మునీంద్రునకు రేణు
కయందుజనించిన నాల్గవకుమారుఁడు. ఇతఁడు బాల్యమున
వేదశాస్త్రములతోఁబాటు ధనుర్విద్యగూడ పూర్తిగ నభ్య
సించెను. ఈతఁడు తపంబున శివుని మెప్పించి, యా దేవదేవుని
యొద్ద శస్త్రవిద్యారహస్యములను గ్రహించెను. శిష్యుని
భక్తికి మెచ్చి యాశివుఁ డీతనికి "పరశువు" నిచ్చెను. "పరశు"
యనగా గండ్రగొడ్డలి.

ఒకనాడు మాహిష్మతీ నగర మేలు కార్తవీర్యార్జునుఁడు
వేటమార్గమున నొక యరణ్యమున కేగి, యటనుండి జమ
దగ్నిమునీంద్రుని యాశ్రమము న బ్రవేసించెను. రాజేంద్రుఁడు
తన యాశ్రమమునకు వచ్చినందులకు సంతోషించి, జమదగ్ని
యాతనిని విందుఁ గుడిచిపొమ్మని కోరెను. కార్తవీర్యుఁడందు
కు సమ్మతించెను. తనయొద్దనున్న కామధేనువు మహిమచే
జమదగ్ని యా కార్తవీర్యునకు పరివారసమేతముగ విందు
జేసెను. భోజనమైనతరువాత గార్తవీర్యుఁడు కామధేనువు
ప్రభావమున కాశ్చర్యపడి దానిని దనకిమ్మని మునీంద్రునిఁ
గోరెను. జమదగ్ని యందులకు సమ్మతింపకపోవుటచేఁ
గార్తవీర్యుఁ డా కామధేనువును బలవంతముగఁ గొనిపోయెను.

ఆ సమయమునఁ బరశురాముఁ డాశ్రమమున లేడు.
ఆశ్రమమునకువచ్చి తండ్రివలన నా వృత్తాంతమువిని, యాతఁ

డా క్షణముననే పరశువునుఁ జేపట్టి మాహిష్మతీపురమునకుఁ బోయి, కార్తవీర్యుని భయంకరమైన యుద్ధమునఁజంపి, కామ ధేనువును దెచ్చి, తండ్రికి సమర్పించెను. తరువాత నీతఁడు కార్తవీర్యుని కుమారులనుగూడ వధించెను. ఇతడు దుష్టులగు క్షత్రియరాజులను నిరువదియొక్కమారులు ఛేదించెను.

పరశురాముని పితృభక్తి వర్ణింపనలవికానిది. ఒక సమయమున జమదగ్ని కెందులకో కోపమువచ్చి భార్యను జంప వలసినదని కొడుకుల కాజ్ఞాపించెను. ఎవ్వరును ఆ పని సేయఁ జాలమనిరి. పరశురాముఁడు తండ్రియాజ్ఞ శిరసావహించి తల్లి శిరము ఖండించెను. జమదగ్ని యాతనిభక్తికిమెచ్చి "నీ కేమి వరము కావలయు?" నని యడిగెను. తల్లినిబ్రతికింపుమని పరశురాముఁడు కోరెను. జమదగ్ని యట్లొనర్చెను.

కార్తవీర్యుడు పరశురామునిచేఁ జంపఁబడినకొన్నాళ్ళకు నాతని పుత్రులుకొందఱు పరశురాముఁ డాశ్రమమున లేనిసమయమునవచ్చి జమదగ్నింజంపి వెళ్ళిరి. ఇందువలనరోషావేశుఁడై పరశురాముఁడు క్షత్రియులనందఱనువధింపఁగాఁభూపరిపాలనముఁ జేయువారు లేకపోయిరి. దొంగతనములు మొదలగునవి హెచ్చెను. పాప మెక్కువయ్యెను. అప్పుడు కశ్యపుఁడను మునీంద్రుఁడుపరశురామునికడకువచ్చి "పరశురామా! నీయట్టి వీరుఁడు త్రిలోకములయందును లేడు. నీవురాజుల నెల్లరఁ జంపి నాడవు. కావున నొక్క మహాయాగము జేసిన నీపాపములు

తోలగున"ని పలికెను. పరశురాముఁడు యాగమొనర్చి భూమి నంతయుఁ గశ్యపునకు దానమిచ్చి యాతని యాజ్ఞననుసరించి, మహేంద్రగిరికిఁబోయి తపముఁజేసికొనుచుండెను.

అనేకసంవత్సరములు గడచినపిమ్మట దశరథునిపుత్రుఁడగు శ్రీరాముఁడు మిథిలానగరమున కేగి, శివునివిల్లువిఱచి సీతను పెండ్లాడెను. దశరథుఁడు కొడుకులను గోడండ్రను వెంటఁబెట్టుకొని, మిక్కిలి యుత్సాహముతో సాకేతపురము నకుఁ బోవునప్పుడు మహేంద్రగిరినుండి పరశురాముఁడు వచ్చి, యాతని యెదిరించెను. దశరథుఁడు భయపడి పరశురామునకు మ్రొక్కి, రామునిచేతఁగూడ నతనికి మ్రొక్కించెను. పరశురాముఁ డాగ్రహమున రామునిఁజూచి "నీవు నా గురువగు శివుని విల్లు విఱచినావఁట ! నే నది సహింపఁజాలక నీపరాక్రమముఁ బరీక్షింపవచ్చితిని. నీవు విఱిచినది ప్రాతవిల్లు. ఇదిగో! నాచేత నున్నది విష్ణుచాపము. దీనినినీవు ఖండించితివేని నీతో ద్వంద్వయుద్ధము సేయుదు"ననెను.

ఆ మాటలకు దశరథుఁడు మిక్కిలి భయంపడి గడగడవణకుచు పరశురామునికిఁ జేతులు జోడించి యిట్లనెను. "దేవా! ఈ రాముఁడు బాలుఁడు. నే ననేకవ్రతములు చేసి నలువురు కుమారులఁ గంటిని. అందులో నీతఁడు పెద్దవాడు. నా ప్రాణములన్నియు నీతనిమీఁదనే యుండును. కావున నీ వీతని రక్షింపుము."

పరశురాముఁడు దశరథునిమాటలు వినలేదు. అంతకంతకు నాతని కోపము హెచ్చిపోవుచుండెను. అప్పుడు రాముఁడాతనింజూచి "పరశురామా! నీవు బ్రాహ్మణుండవని మేము మ్రొక్కితిమిగాని నీకు భయపడి కాదు. అకారణముగ నీవు నాతోఁ గయ్యమునకుఁ గాలుద్రువ్వుచుంటివి. ఇందులకు నే నేమందును? నేను శివునివిల్లు విఱచితినని నీకింతకోపమేల? నీవు నాబలము పరీక్షింపఁదలఁచికదా వచ్చితివి. నేను ధన్యుఁడ నగుదును. ఏదీ! నీచేతనున్న చాపము?" అని పలికి, పరశురామునిచేతనున్న చాప మందుకొనెను. రాముఁడు చాప మందుకొనఁగనే పరశురామునిబలము క్రుంగిపోయెను. అతని తేజము క్షీణించెను. అతఁడు బలహీనుఁడై రాముని జూచి "రామా! భాస్కరవంశాబ్ధిసోమా! నీవు శ్రీమన్నారాయణుఁడవని నాకు బోధపడినది. ఇతరులైనచో నా శరాసనము బట్టజాలరు. నాగర్వము నేడు నీవలనఁ బూర్తిగ భంగమైనది. అయినను నాకిది పరాభవము కాదు. మన మిరువురమును విష్ణువుయొక్క యంశయందు బుట్టినవారము" యని పలికి యాతని యనుమతిఁబొంది నిజనివాసమునకుఁ బోయెను.

పరశురాముఁడు చిరంజీవి. ఈతనివలన ద్రోణుఁడు, భీష్ముఁడు, కర్ణుఁడు మొదలగువా రస్త్రవిద్యల నభ్యసించిరి.

మనమెట్టి స్థితియందుండినను గర్వపడరాదు. గర్వపడువారికి తప్పక భంగముకలుగును.

---

# 3. మిత్రద్రోహి.

పూర్వము గౌతముఁడను బ్రాహ్మణుఁడు కలడు. అతఁడు తనకులధర్మములవిడిచి, బోయదానిని భార్యగాఁ జేసికొని, కిరాతులఁగూడి వేటకుఁబోవుచు, మాంసముఁదినుచు నీచవృత్తిచేఁ గాలముగడపుచుండెను. ఇట్లుండి ధనము సంపాదించుటకుఁ గొందఱువర్తకులతో స్నేహముజేసికొని వారితో దేశాంతరమునకు బయలుదేరెను. వారందఱు నట్లుపోవుచు నొకమహారణ్యమున బ్రవేశించిరి అందొక యడవియేనుఁగు వారిపైకి వచ్చెను. అందఱును మిక్కిలి భయపడి నలుదిక్కులకుఁ బాఱిపోయిరి. గౌతము డొక మార్గమునుబట్టి పోయిపోయి, యొక విశాలమైన మఱ్ఱిచెట్టుక్రింద సేదఁదీర్చుకొనుటకుఁ గూర్చుండెను. ఆసమయమున నచ్చటికి నాడీజంఘుఁడు రాజధర్ముఁడను పేరుగల యొక బకమువచ్చి యా భూసురుని జూచి "నీ వెచ్చటికిఁ బోవుచున్నావు? నిన్ను జూచినంతనే నాకు సంతోషము కలిగినది. నేడు నీవు నాయింటికతిథివైతి" వని పలికెను. గౌతముఁడు తనవృత్తాంత మాబకమున కెఱింగించెను. బ్రాహ్మణునిమాటలు విని నాడీజంఘుఁడు "బ్రాహ్మణోత్తమా! నీ దారిద్ర్యము నేనుఁదీర్చెదను.నీవు విచారముమాని నే నిచ్చు నాతిథ్యము గ్రహింపు" మని చెప్పి మందాకినీ నదియందుఁ దాను తెచ్చినమత్స్యములనుఁ బక్వముచేసి వన్యఫలములతో

నాతని కాహారమిడి తృప్తిపఱచెను. ఆ రాత్రి గౌతముఁడు బకమునిర్మించిన పర్ణశయ్యయందుఁ గాలముగడపెను. మరునాఁ డుదయమున నాకొక్కెఱ ఆ భూసురున కిట్లుపలికెను. "స్నేహితుఁడు, బంగారు, వెండి, బుద్ధియును దారిద్ర్యము పోఁగొట్టుటకు సాధనములై యున్నవి. ఈనాలుగింటియందును మిత్రుఁడెక్కుడైన వాఁడు. నేను నీకు నేటినుండి మిత్రుఁడనై మెలఁగుచుందును. ఇచ్చటి కనతిదూరమున మధువ్రజమను పురమున్నది. దానిఁ బరిపాలించు విరూపాక్షుఁడు నాకు మిత్రుఁడైయున్నాఁడు. నీవు తిన్నగా నాతనిపాలికిఁబోయి నేను చెప్పితినని చెప్పుము. ఆతఁడు నీకుఁ గావలసిన ధనమిచ్చును."

గౌతముఁడు బకముచెప్పిన మార్గము ననుసరించి విరూపాక్షునియొద్దకుఁబోయి తనవృత్తాంతమంతయుఁ దెలిపి "నేను నీస్నేహితుఁడగు రాజధర్ముఁడుపంపగా వచ్చితిని. నా దారిద్ర్యబాధ నీవు దీర్పఁగలసమర్థుఁడవని యాతఁడు చెప్పినాఁ" డనెను. దానవుఁ డాతనివృత్తాంత మెఱిఁగి, యాతఁ డెట్టి వాఁడైనను నాఁడీజంఘునకుమిత్రుఁడగుటచే సహాయముఁ జేయ వలయుననితలంచి, యాతని కాదినంబున ననేకపదార్థంబులతో నాహారమిడి, మరునాఁడు మోయలేనంత కనకము, రత్నములు మొదలగు ధనరాసులనొసంగి పంపెను.

ఆ బ్రాహ్మణుఁడు మిగుల సంతసించి నా ధనమును మోయలేక మోసికొనిపోయి మరలబకంబున్నస్థలముఁ జేరెను.

ఆ బక మాటని నాదరించి, తన మిత్రునిమూలమున నాతఁడు భాగ్యవంతుఁడయ్యెనని సంశసించి, మార్గాయాసమున డస్సి యున్న యాతనికిఁ దన రెక్కలచే విసరి, యన్నపానములచే నతనినిఁ దృప్తిపఱచెను. ఆరాత్రి బకము నిద్దురబోవుచుండఁ, గృతఘ్నుఁడగు నాబ్రాహ్మణుఁడు మఱుచటిదినమున నాహారమునకై యోచించి "ఈ బకము మిగుల మదించియున్నది. దీని నాహారముగాఁ జేసికొందు" నని తలంచి యా బకమును జంపి, యీకలఁదీసివేసి, మాంసమును దీసికొని డొక్కనచ్చట బాఱవేసి పయనమయ్యెను.

అంత నక్కడ దెల్లవాఱినయంతనే విరూపాక్షుఁడు నాడీజంఘుఁడు తన కడకు రాకుండుటకుఁ గారణ మేమై యుండునా! యని విచారించి, బ్రాహ్మణుఁ డేమైన నాతనికిఁ గీడు జేసెనేమోయని తలంచి, యతనికై సేవకులఁ బంపెను. భటులరిగి చూచి నాడీజంఘుని మరణమును విరూపాక్షునకుఁ దెల్పిరి. తరువాత భటులు విరూపాక్షుని యనుమతిని బ్రాహ్మణుఁడుపోయిన మార్గమునఁ దొందరగా నరిగి, యాతనిని బట్టుకొని చేతులు విఱిచికట్టి, దీసికొనివచ్చిరి. విరూపాక్షుఁడు భటులఁజూచి "ఈ కృతఘ్నుని యిష్టమువచ్చినట్లు చేయుఁ" డనెను. భటులా బ్రాహ్మణుని పురముబయలునకుఁ దీసికొనిపోయి శరీరమంతయు రక్తముకాఱునట్లు పొడిచి చంపి పాఱవేసిరి.

అనంతరము విరూపాక్షుఁడు మిత్రుని మరణమునకుఁ జింతించుచుండ, దేవేంద్రుఁడు వచ్చి "దానవేంద్రా! నీ హితుఁడగు నాడీజంఘుఁడు చతుర్ముఖునకు మిత్రుఁడు. పలుమాఱు బ్రహ్మపాలి కాతఁడుపోవకుండుటచే నిట్టి దశఁబొందినాఁడు. కాని, బ్రహ్మ మహిమచేత నతఁడు మరల జీవించినాఁడు. నీవు చింతింపవలదు" అని చెప్పెను. ఇట్లు వీరిరువురును మాటలాడుచుండఁగా నచ్చటికి రాజధర్ముఁడు వచ్చెను. ఆతనినిఁ జూచి విరూపాక్షుఁడు సంతసించెను. రాజధర్ముఁడు తనమూలమున బ్రాహ్మణున కిట్టి దీనదశ సంభవించినదని దెలిసి, రాక్షసభటులకుఁ జిక్కి కొన ప్రాణములతోనున్న యాతనిని విడువుమని కోరెను. రాజధర్ముని కోరిక ననుసరించి, బ్రాహ్మణుని రావించి, విరూపాక్షుఁడాతనికి మరల ధన మిచ్చి, పంపివేసెను.

మన కితరులు చేసినమేలును మఱువరాదు. చేసిన మేలును మఱచినవారిని కృతఘ్నులందురు. మనమెట్టివారి యెడనైనను ద్రోహచింతనము చేయరాదు. ద్రోహము మిగుల పాపకరము; అందులో మిత్రద్రోహముకంటె నెక్కుడు పాతకంబైన దేదియు లేదు.

---

# 4. ధైర్యపరీక్ష.

పూర్వము రంతిదేవుఁడను నొక రాజుండెను. ఆతఁడు హరిభక్తుఁడు ధర్మబుద్ధిగలవాఁడు. సత్యసంధుఁడు. అతఁడనేక సంవత్సరములు రాజ్యముఁ బాలించెను. తుదకు రాజ్యభోగములందు విరక్తిఁజెంది తనకున్న ధనమంతయు దీనులకిచ్చి, తపస్సుఁజేసికొనుట కరణ్యమునకుఁబోయెను. ఒకసమయమున నతఁడు నలువది యెనిమిది దినములు అన్నపానములు లేక తీర్థములందుఁదిరిగి నలువది తొమ్మిదవ దినమున నొకగ్రామమున బిక్షఁదెచ్చుకొని ఒకసెలయేటిగట్టునఁ బెట్టుకొని తినుటకు సిద్ధముగా నుండెను. అప్పుడొక భూసురుఁడు వచ్చి యాకలని నాహారమడిగెను. అంతట నతఁడు హరిసమర్పణమని యా యాహారములో సగభాగమా బ్రాహ్మణునకు సంతోషముతోఁబెట్టెను. బ్రాహ్మణుఁడు దానిని భుజించి వెళ్ళెను. తక్కిన సగమును రంతిదేవుఁడు తిననున్న సమయమున నొక శూద్రుఁడువచ్చెను. ఉన్న యాహారమతనికిచ్చి పంపించెను. ఆహా! కష్టసమయముననైనను శీలవంతులు తమ వ్రతమును విడువరుకదా! ఇన్ని దినములనుండియు నాహారములేక యెట్లో తెచ్చుకొని భుజింపనున్న సమయమున భగవంతుఁ డాతనిమనస్సునుఁ బరీక్షింపఁదలఁచెను. ఇఁక రంతిదేవునియొద్దఁ ద్రావుటకు జలములుమాత్రముండెను. ఆతఁడు

వానిని డ్రాగి కడుపు నింపుకొందమనితలంచుచుండగా నొక్క-
చండాలుఁడువచ్చి "మహాప్రభో! నేను హీనకులమునఁ బుట్టిన
వాడను. ఆకలిబాధ మిక్కుటముగనున్నది. ఒక్కయడుగైనను
నడువఁజాలకయున్నాను. నాయాకలిదప్పులఁదీర్చి పుణ్యముఁగట్టు
కొను'మని యతిదీనముగా వేడుకొనెను. రంతిదేవుఁడు వాని
మాటలు విని "నాయొద్ద నన్నములేదు. జలములుమాత్ర
మున్నవి. ఇవి నీ కిచ్చెదను. నా కింతకంటెఁ గావలసినభాగ్య
మేమున్నది! ఎట్టిసమయముననైనను దానపురుషులు తమ
యొద్దనున్నదాని నడిగినవారికిచ్చి సంతోషపడవలయును.
నీవు చండాలుఁడవైననేమి? ఎవ్వరైననేమి? భగవంతునకు
కులముతోఁ బనిలేదు. ఇటురమ్ము. నాయొద్దనున్న జలముతో
దాహముదీర్చుకొని విశ్రాంతిబొందుము," అనిపలికి, తనయొద్ద
నున్నజలములు వానికిఁబోసెను.

రంతిదేవుఁ డట్లు చేసినవెంటనే బ్రహ్మాదిదేవతలు నిజ
రూపములతోఁ బ్రసన్నులై "రంతిదేవా! నీధైర్యమును పరీ
క్షించుటకే మేమట్టిరూపములతో నీకడకు వచ్చితిమి. నిన్ను
బోలిన మహనీయుఁ డెవ్వఁడును లేడు, ఇట్టిసమయములో నింత
యౌదార్యముండుట కష్టము. నీగుణమునకు సంతసించితి"మని
పలికి, యాతని కనేకవరములిచ్చిరి. అనంతరము రంతిదేవుఁడు
శ్రీహరినిఁ గూర్చి తపముఁజేసి ముక్తిఁనొందెను.

దైవభక్తిగల నుదారపురుషులు యెట్టి కష్టసమయమందైనను తమ వ్రతమును విడువక, యితరులకు తమకుఁ దోఁచినరీతిగ సాయమొనర్తురు.

---

## 5. న్యాయవర్తనము.

పూర్వము శంఖలిఖితులను నిరువురు సోదరులుండిరి. వారు బాహుదానదీతీరమున వాసముఁ జేయుచుండిరి. ఒకనాడు శంఖుఁ డాశ్రమమున లేనిసమయమున లిఖితుఁడు సమీపముననున్న వనమునకుఁ బోయి పండ్లుగోసికొని తినెను. అది రాజేంద్రుని వనము. శంఖుఁ డాశ్రమమునకు వచ్చి తమ్ముఁడు పండ్లుదినుటఁ జూచి "యవియెక్కడి?" వని యడిగెను. లిఖితుఁడు సత్యము జెప్పెను. శంఖుఁ డతనినిజూచి తమ్ముఁడా! అనుమతిలేకుండ నీవు రాజువనమున ఫలములు కోసితివి. ఇది దొంగతనముకాక వేరేమున్నది? మఱియుఁ దొంగతనమువలన బాపము సంభవించును. కావున నీవు శీఘ్రముగ రాజసన్నిధికిఁ బోయి నీ నేరమును ఒప్పుకొని దండింపుమని వేడికొనుము" అని పలికెను. లిఖితుఁడు రాజమందిరమునకుఁ బోయి ద్వారముకడ నిలిచియుండెను. భటులాతనిరాకను రాజునకు దెలిపిరి. రాజేంద్రుడు లిఖితునకెదురువచ్చి తోడ్కొనిపోయి పీఠమున

గూర్చుండఁబెట్టి వినయముతో నిట్లనెను. "మహాత్మా! నీరాకవలన నా మందిరము పావనమైనది. నేను కృతార్థుఁడ నైతిని. నీవిచ్చటి కరుదెంచిన కార్యమేమి? అది యెట్టిదైనను జేసెద." లిఖితుఁడు తానొనర్చిన ఫలముల దొంగతనమును జెప్పి తన్ను చోరులను శిక్షించు విధమున శిక్షించి పాపము రు బోగొట్టుమని వేడుకొనెను.

లిఖితుని మాటలువిని రాజు నాశ్చర్యపడి "బ్రాహ్మణోత్తమా! నన్నిట్టికార్యముఁ జేయుమనుట తగ"దని యనేక ప్రకారములఁ జెప్పెను. లిఖితుఁడు "రాజేంద్రా! నీవు సంశయింపవలదు. నన్ను దండించినచో నీకుఁ బాపము సంభవింపదు. రాజుచే దండింపఁబడినవానిని యముఁడు దండింపఁడని యార్యులు చెప్పుదురు" అని చెప్పెను. రాజెంత బ్రతిమాలినను లిఖితుఁడు వినలేదు. అందుచే నృపాలుఁ డాతనికరములు ఖండించెను

లిఖితుఁడు నరపాలు నాశీర్వదించి, యాశ్రమమునకు వచ్చి, ఖండింపఁబడిన హస్తములను దనయన్నకుఁ జూపెను. అప్పుడు శంఖుఁడు తమ్మునిఁజూచి "తమ్ముడా! నీమూలమునఁ గులమునకుఁ గౌరవము వచ్చినది. ఇఁక నీవు బాహుదానది యందు స్నానము జేయుము. కల్లుద్రావుట, బ్రాహ్మణుని జంపుట, దొంగిలించుట మొదలగునవి మహాపాతకములని

ధర్మశాస్త్రములయందుఁ జెప్పఁబడియున్నది. ఈపాతకములలో నేది చేసినను నేకులజుడైనను దండనకు పాత్రుడే" యనెను. లిఖితుఁడు తనయన్నయాజ్ఞానుసారముగా బాహుదానదియందు స్నానము జేసెను. ఖండింపఁబడిన యాతనిహస్తములు స్నానము జేసినయంత నేమరలనుద్భవించెను. అప్పుడులిఖితుఁడాశ్చర్యపడి తనయన్నకడకువచ్చి, హస్తములఁజూప, నాతఁడుతమ్మునిజూచి "తమ్ముఁడా ! ఇందులకు నీ వాశ్చర్యపడఁ బనిలేదు. ఇది భగవంతుని కరుణవలన నాకుగలిగిన తపోమహిమచేత జరిగినది. నీవింక శుచివైతివి. నిన్ను దండించిన రాజేంద్రుఁడును ధన్యుఁడయ్యె" నని బలికెను.

చేసిననేరము ఒప్పుకొనుటవలన గీర్తియు,దైవమెప్పును బడయగలుగుదుము.

---

# 6. మాతృభక్తి.

మున్ను కశ్యపునివరమున వినత యను కాంతకు గరుడుఁడను కుమారుఁడు పుట్టెను. ఆతఁడు మిగుల బలము గలవాఁడు. అతఁడు తన తల్లియాజ్ఞ ననుసరించి, సవతితల్లి యగు కద్రువకు పుట్టిన సర్పములను మోయుచుండెను. ఒక సమయమున నా సర్పము లాతని వీపునుండి నేలఁబడెను.

అది కద్రువచూచి "నా కుమారుల నేల నేలపైఁ బడ వేసితి"
వని యడిగి యాతనిని దూషించెను. అప్పు డాతఁడు కన్నతల్లి
యగు వినతం జేరి "తల్లీ ! నీ సవతియగు కద్రువకు నాచేత
నేల పనులు చేయించెద?" వని యడిగెను. అప్పుడు వినత
కుమారున కిట్లు పలికెను. "వత్సా! ఇంద్రుని గుఱ్ఱమగు ఉచ్చై
శ్రవమునకు తోకయందు నలుపులేదని నేనును, నున్నదని
యామెయు వివాదమాడి, యెవరోడిపోయిన వారెవరునో వా రవ
తలవారికి దాసిగా నుండు నట్లేర్పాటు చేసికొంటిమి. అందు నే
నోడి పోయితిని. ఆ కారణమున నగ్గసవతికి నేను దాసినైతిని.
నాపరాధమున నీవుగూడ నామెకుఁ బనులు జేయవలసి
వచ్చెను ఈ నీచవృత్తి నీవలనఁ బాయవలయును."

అప్పుడు గరుడుఁడు సవతితల్లి కుమారులఁ జేరి,
"మీకిష్టమైన దేదియైనఁ దెచ్చియిచ్చెద; నా తల్లిని దాస్యము
నుండి తొలఁగింపు" డనెను. కద్రువకొడుకులు "మా కమృత
ము దెచ్చియిచ్చినచో మీ తల్లిని దాస్యమునుండి విడచెద"
మని పలికిరి. వినతాసుతుఁడందులకు సంతోషముతో నంగీక
రించి, జనని యాశీర్వచనము గైకొని బయలుదేరి యమరలో
కమునకుఁ బోయెను. అచ్చట నమృతము వీరభటులచేఁ గాపా
డఁబడుచుండెను. ఈతఁడు వారినోడించి యమృతమును
గ్రాగకుండ, వాయువేగమున వచ్చుచుండ మార్గమధ్యమున
శ్రీహరి ప్రసన్నుఁడై 'గరుడా! నీయసమానమైన మాతృభక్తికి

సంతోషించితిని. నీకు వలసినవరంబులఁ గోరుము. ఇచ్చెద" ననెను. గరుడుఁడు శ్రీహరికి నమస్కరించి "దేవా! నే నమృతము ద్రాగకపోయినను నాకెన్నటికి చావులేకుండునట్లుగను, నిరంతరము నిన్నుగొల్చుచుండునట్లుగను వరము లనుగ్రహింపు" మని వేడెను. శ్రీహరి యతఁడు కోరిన వరముల నిచ్చుటయేగాక నాతనిని దనవాహనముగను ధ్వజముగను జేసికొనెను.

ఇంతలో గరుడుఁ డమృతముఁ గైకొని పోవుచుండుటఁగని దేవేంద్రుఁడు యాతనిపై వజ్రాయుధమును బ్రయోగించెను. వినతాపుత్రుఁడు దానికిఁజలింపక, తనరెక్కయందుఁ గొంచెము భాగమాయాయుధమున కాహారముగానిచ్చెను. దేవేంద్రుఁ డాశ్చర్యపడిఁ యాతనితో స్నేహము జేసికొనెను.

ఆహా! మాతృభక్తి మూలముననే గరుడుఁడు దేవేంద్రునిఁ గెలుచుటయు, శ్రీహరిచే వరములు పొందుటయుఁ దటస్థించినదికదా! ఈవిధమున గరుఁడు డమృతమును దీసికొని పోయి, కద్రువసంతానమున కిచ్చి, తనతల్లిని దాస్యమునుండి తొలఁగించెను.

తలికంటె వేరు దైవంబులేదు.

# 7. యుగంధరుఁడు.

ఇప్పుడు నైజామురాష్ట్రములోనున్న ఓరుగల్లు లేక "వారంగల్" పూర్వ మొక గొప్పసామ్రాజ్యమునకు ముఖ్య పట్టణముగా నుండెను. అందు ప్రతాపరుద్రుఁడనురాజు పాలించు చుండెను. అతనియొద్ద యుగంధరుఁడను యమాత్యశేఖరుఁ డుండెను. యుగంధరుఁడట్టి నేర్పరియు రాజ్యతంత్రము నెఱిగిన వాఁ రెవ్వరును లేరని యతఁడు ప్రఖ్యాతివడసియుండెను. ఇతని సహాయమువలన ప్రతాపరుద్రుఁడు యవలీలగా తనరాజకార్య ములను నిపుణతతో నెరవేర్చుచు, జనరంజకముగా పాలించు చుండెను. ప్రతాపరుద్రుని కెడతెగక తురకలతో పోరాటము కలుగుచుండెను; గాని యుగంధరుని సాయముచేత నతఁడు జయము పొందుచుండెను.

ఒకసమయమున, యుగంధరుఁడు రామేశ్వరయాత్రకుఁ బోయెను. అట్టితఱి వేటకుబోయి, యలసి, యొక మఱ్ఱిచెట్టు నీడను నిద్రించుచున్న ప్రతాపరుద్రుని తురకలు పట్టుకొనివెళ్ళి ఢిల్లీయందు చెరసాలయందుంచిరి. యుగంధరుఁడు ఓరుగల్లును వచ్చినతోడనే యీ వృత్తాంతము విని మిగుల చింతించెను. కాని యుగంధరుఁడు యధైర్యమందలేదు. అతఁడు ప్రతాప రుద్రుని నెట్లయినఁ జెఱవిడిపించి తీసికొనిరావలయునని లోలోన నాలోచించుచు నుపాయములు వెదకుచుండెను. మహా

యుపాయశాలియగు యుగంధరునికి సాధ్యముకాని కార్యము లేదు; ఆపట్టణమందు యన్నివిషయములందును బ్రతాపరుద్రుని పోలికయుండు పేరిగాడను చాకలి యుండెను యుగంధరుడు వానికి రాజవేషము వేసి, తురకలు గొనిపోయినది రాజు పోలికగల చాకలివానినిగాని ప్రతాపరుద్రునిగాదని యూరిలో వదంతిచేసెను. ఈ వృత్తాంతము క్రమముగ రాజ్యమంతయు వెల్లడియై, తుదకు ఢిల్లీకిచేరెను. తురకలాశ్చర్యపడి యవమానము సహింపలేకయుండిరి. యోరుగంటిలో యుగంధరుడు మంత్రులను జాగ్రత్తతోనుండుడని చెప్పి, చేయవలసిన పనులను యతిరహస్యముగా నెఱింగించి, తాను ఢిల్లీకేగెను.

యుగంధరుడు ప్రతాపరుద్రుని విడిపించుకొనవచ్చుటయేగాక, ఢిల్లీసుల్తానునుగూడ బహిరంగముగా నోరుగల్లునకు దీసికొనిరావలయునని బట్టుపట్టెను. ఇట్టి పట్టుదలతో నాతడు, పుర్రెలను యెముకలను హారములుగా వేసికొని, ప్రాతగొంగళిజుట్టుకొని, "ఢిల్లీసుల్తాన్ పట్టుకపోతాన్" అని కేకలు బెట్టుచు నిద్రాహారములుమాని కేవలము పిచ్చివానివలె ఢిల్లీ నగరమంతయు దిరుగుచుండెను. ఇట్లాతడు తిరుగుచుండుటయేగాక తగినవారి నేర్పఱచి, తురుష్కులయొద్ద ననేక రహస్యకార్యములను నద్భుతముగా జేయించుచుండెను.

ఇట్లుండ యుగంధరు డంతకుముందే చేసిన యేర్పాటు ననుసరించి కొందఱు నగలవర్తకులు రత్నములు మొదలగు

నవి యోడలోఁ బెట్టుకొనివచ్చి ఢిల్లీసుల్తానును జూడవచ్చిరి. రత్నవర్తకులు తమ సరుకంతయు నోడలో నున్నదనియు, దానిని సభలోనికిఁ దెచ్చుట కష్టమనియుఁ, దెలిపి సుల్తానునే యోడలోనికి రమ్మని చెప్పిరి. సుల్తానందులకు సమ్మతించి కొందరు వజీర్లతో నదియందున్న యోడలోనికిఁ బోయెను. చెఱయందుంపఁబడిన ప్రతాపరుద్రుఁడుగూడ సౌదాగరు వేష మున నగలధరలుకట్టుటకుఁ దీసికొనిరాబడెను. యుగంధరుడు "ఢిల్లీసుల్తానును బట్టుకపోతా" నని పిచ్చికేకలు వేయుచు నోడ నెక్కెను. సుల్తాను వజీర్లతో భుజించి తప్పత్రాగి నగలు పరీక్షసేయు సమయమున నెమ్మదిగా నోడ విడువఁబడెను. యుగంధరునివలన ముందుగనే నేర్పాటుకాబడిన చెఱకుఁకి యను నతడు చేసిన యుపాయమువలన నోడలో నిరువురు తురకలొకరినొకరుపొడుచుకొని చచ్చిరి. మఱికొందఱు నీటిలో ద్రోయఁబడిరి. ఇఁక బ్రతాపరుద్రునికిగాని, యుగంధరునికి గాని గొంచెమైనను భయములేదు. సుల్తాను యమితముగా ద్రాగుటచే నోడలుదెలియకఁ బడియుండెను. అప్పుడు ప్రతాప రుద్రుఁడు వెఱ్ఱివానివలెనున్న యుగంధరుని జేరి నమస్కరించి, తన్నురక్షించిన యాతని ననేకవిధములఁ గొనియాడెను. అంతలో నోడ యోరుగల్లురేవుఁ జేరెను. ఓడయందున్న వారివేషములు మాఱిపోయినవి. యుగంధరుఁడును, ప్రతాప రుద్రుఁడును లేరు. అందున్నవారు సుల్తానునుజూచి "ఇది

యోరుగల్లులేవు. నీ విచ్చటికిఁ గొనిరాబడితి''వని చెప్పి, యాతనిని గౌరవముగా నగరములోనికిఁ దీసికొనిపోయిరి. ప్రతాపరుద్రుఁడు యుగంధరాదులతో సభఁదీర్చియుండఁగా ఢిల్లీసుల్తాను గొనిరాబడెను. సుల్తాను ప్రతాపరుద్రునిఁ జూచి "మహారాజువారియెడల మేము దుర్బుద్ధిఁబూని పట్టు కొనఁదలఁచితిమి. తుదకు మా సరదారులు చాకలివానిని బట్టుకొనివచ్చి మా కవమానము గూర్చిరి. మేము మీయెడల జేసిన యపరాధమును క్షమింపవలయును. ఈ దినమునుండి మేము మీకు స్నేహితులము," అనిపలికి "ఢిల్లీసుల్తానును పట్టుకపోతానని యోడలోనెక్కినపిచ్చివాడే"డని యడిగెను. అందులకుఁ బ్రతాపరుద్రుఁడు సుల్తానునుజూచి "సుల్తాను గారూ! ఆ పిచ్చివాఁడే యుగంధరామాత్యుఁడు. మీచే బంధింపఁబడిన చాకలివానిని దెచ్చుటకై యిట్టివేషమును వేసెనని చెప్పెను. సుల్తానుమిగుల నద్భుతమందెను. తరువాత సుల్తాను గౌరవపూర్వకముగ ఢిల్లీకిఁ బంపఁబడెను.

బుద్ధికుశలతచేత నెట్టి కడిఁదికార్యములైన సాధింప వచ్చును.



# 8. ఖడ్గతిక్కన.

తిక్కనయొక్క పరాక్రమమునుగూర్చి చెప్పుటకు ముందుగా నాతని వంశమునుగూర్చి కొంత చెప్పవలసి యున్నది. ఈతని యింటిపేరు కొట్టరువువారు. వీరిది గౌతమ గోత్రము. గుంటూరుసీమకు నధిపతియైన మంత్రిభాస్కరు డీతనికిఁ బితామహుఁడు. మంత్రిభాస్కరునకు కొమ్మాంబ యను భార్యయందు కేతన, మల్లన, సిద్ధన, కొమ్మనయను నలువురు కుమారులుండిరి. వీరితాతయగు కేతన యనునతఁడు కమ్మనాటిసీమ నేలిన త్రిభువనమల్లదేవునియొద్ద మంత్రిగ నుండి గొప్పకీర్తి సంపాదించెను. ఈతని మనుమలగు కేతన మల్లనలుగూడ నట్లే కీర్తిబడసిరి. సిద్ధనయనునతఁడు నెల్లూరు మండల మేలిన తిక్కరాజునొద్ద మంత్రియు, సేనాధిపతిగా నుండెను. సిద్ధయమంత్రికి జనించిన సుతులలో ఖడ్గతిక్కన జ్యేష్ఠుఁడు. సిద్ధయమంత్రితమ్ముఁడైన కొమ్మనకొక కుమారుఁడు కలిగెను. ఇతఁడే కవితిక్కన.

ఖడ్గతిక్కనయు, కవితిక్కనయు నెల్లూరుమండలాధిపతియైన మనుమసిద్ధికిఁ గుడియెడమ భుజములై రాజ్యతంత్రము నడిపి మిగుల ప్రఖ్యాతిగాంచిరి. మనుమసిద్ధి రాజగునప్పటి కాతనిరాజ్యము కావలిమొదలు కాంచీపురమువఱకు

వ్యాపించియున్నను, రాష్ట్రమంతయుఁ గలహములతో నిండి యుండెను. కాంచీపుర సింహాసనముకై కలహములు పెరిగెను. ఎవరికివారే యధిపతులగుటకుఁ బ్రయత్నించుచుండిరి. ఇట్టి సమయమున మంత్రిగానుండిన కవితిక్కనయు, సైన్యాధిపతిగ నుండిన ఖడ్గతిక్కనయుఁ మనుమసిద్ధిరాజ్యమును రక్షించిరని చెప్పవచ్చును.

ఖడ్గతిక్కనయొక్క పరాక్రమము లోకమునకు వెల్లడి చేయు సమయమువచ్చెను. అప్పుడు కనిగిరిసీమకు, కాటమ రాజనునతఁ డధికారిగనుండెను. అతనికిని మనుమసిద్ధికిని, బసువుల మేపుకొనినందుల కీయవలసిన పన్నువిషయమై వివాదము సంభవించెను. తుదకది భయాకరమైన యుద్ధముగా మారెను. ఉభయపక్షములయందుఁ బెక్కండ్రు వీరులు చేరిరి. మనుమసిద్ధిపక్షమున ఖడ్గతిక్కన సైన్యాధిపత్యము వహించి కాటమరాజుపైకి వెడలెను. ఇరుతెగలవారును పాలేటియొడ్డున నున్న పంచలింగాల యనుప్రదేశమునఁ గలిసికొనిరి. పోరాట మతిఘోరముగా జరిగెను. ఖడ్గతిక్కన యతిభయాకరముగాఁ బోరాడెనుగాని, తనసైన్యములోఁ జాలభాగము మడియుట వలన జయము పొందుటకు మార్గములేకయుండెను. అందు చేత నాతఁడు మరల రావచ్చునని తలచి యుద్ధభూమి విడిచి పోయెను. తిక్కన యోటుపడెనను వార్త మనుమసిద్ధినృపాలునకేగాక, గృహమునన్నుయాతని తల్లికిని, భార్యకును

గూడఁ దెలియవచ్చెను. తిక్కన పురమునకు వచ్చి తనగృహ మును ప్రవేశించి స్నానముఁ జేయుటకు దొడ్డిలోనికిఁ బోయెను. ఆతఁడు స్నానముఁజేయు ప్రదేశమున నొక నులక మంచ మడ్డముగాఁ బెట్టఁబడి యొక పసుపుముద్ద యుంచఁ బడుటఁజూచి 'అదియే'మని తల్లిని, భార్యను నడిగెను. అప్పుడు వారిట్లు చెప్పిరట.

క. పగఱకు వెన్నిచ్చినచో
నగరే! నినుమగతనాపు ♦ నాయకు లెంకన్
ముగురాడ వారమైతిమి
వగపేటికి జలకమాడ ♦ వచ్చిన వేళన్.

ఈ పలుకులువిని తిక్కన రోషము పట్టజాలక యాక్షణముననే గృహమువిడిచి మనుమసిద్ధి యాజ్ఞనుబొంది మరల సైన్యమునుఁదీసికొని యుద్ధరంగమునకువచ్చి యనేకవీరులను దనఖడ్గమునకు బలియిచ్చి తుదకు తానే వీరస్వర్గమందెను.

శూరుల కపజయముకంటె ప్రాణత్యాగము మేలు.

# 9. రోహిదాసుఁడు.

గంగా తీరమున నొక పల్లెయందు రోహిదాసుఁ డను నొక చండాలుఁడు నివసించుచుండెను. ఆతఁడు కులమునకు మాలవాఁడైనను, శాంతము, దయ, భగవద్భక్తి, వినయము,

సజ్జనసేవ మొదలగు సద్గుణములన్నియు నాతనియొద్ద నుండెను. ఆతడొక తులసికోటను నిర్మించుకొని యందొక తులసిమొక్కను యతిభక్తితోఁ బూజించుచుండెను. ప్రతిదిన మతఁడు తులసిమొక్కకు తొలుతిత్తితోఁ దెచ్చిన జలమునుఁ బోసి, తన యొద్ద తొలుసంచిలోనున్న సాలగ్రామమును బూజఁ జేయుచుండును. ఆతనికిఁ జెప్పులజోళ్ళు కుట్టుకొని జీవించువృత్తి యగుటచేత, నతఁడు ప్రతి యేకాదశిదినమునందున నొక భక్తున కొక పాదరక్షలజోడు సమర్పించుకొనుచుండెను. ఆతఁడు ధర్మబుద్ధిగలవాఁడగుటచేతను, హరిభక్తుఁడగుటచేతను, నాతఁడు కుట్టిన పాదరక్షలను న్యాయమగు ధరకు విక్రయించి, శ్రీహరిని సేవించుచు జీవయాత్ర వెడలఁదీయుచుండెను. ఆతని సుణములను, భక్తిని గ్రామవాసులనేక విధములఁ బొగడుచుండిరి.

ఇట్లుండ నొకదినమున నొక బ్రాహ్మణుఁడుఁ రోహిదాసున కవమానము గలిగింపనెంచి వాని యింటి యెదుటకు వచ్చెను. ఆ సమయమున రోహిదాసు తులసికోటమీఁదఁ గూర్చుండి సాలగ్రామమును పూజించుచుండెను. బ్రాహ్మణునిఁ జూచినతోడనే యాతఁడు లేచి నమస్కరించెను. బ్రాహ్మణుఁడు వానిని జూచి "ఓరీ! నీవు మాలవాఁడవు. తులసిని ముట్టుకొనుచుంటివా!" యనెను. అందులకు రోహిదాసుఁడు స్వామీ! "నేను తులసికోటను వేయుటయే గాక తొలుబరణితో

సాలగ్రామమునుంచి యనుదినమును బూజించుచుందు” నని పలికెను. ఆ మాటలకు బ్రాహ్మణుఁ డాగ్రహపడి “చండాలుఁడా! తులసికోట నిర్మించుకొనుటయేగాక పవిత్రమైన సాలగ్రామమును తోలుసంచిలో నుంచితివా! దానిని ముట్టుకొనుటకు నీ కర్హత యున్నదా! అదియుంగాక పూజగూడ జేయుచుంటివా!” యని యనేకవిధముల దూషింప నారంభించెను. అప్పుడు రోహిదాసు బ్రాహ్మణునితో “అయ్యా! భగవంతుని సేవించుటకుఁ గులముతోఁ బనిలేదు. నాకున్నది తోలు బరిణికావున సాలగ్రామ మందుంచితిని. దీనికి మీ రాగ్రహించెద రేల? మన దేహమంతయుఁ జర్మము కాదా! మనదేహములందు భగవంతుఁడు వసించుచుండుట లేదా!” యని వినయపూర్వకముగఁ బలికెను. బ్రాహ్మణుఁడు మఱింత కోపము దెచ్చుకొని “ఓరీ! నీచుఁడా! ఇట్లు పలుకుచున్న నిన్నేమిచేసినను బాపము సంభవింపదు. చూడుము. పెద్దలతోఁ జెప్పి నిన్నేమిచేయించెదనో” యని చిందులు త్రొక్క సాగెను.

క్షణములో రోహిదాసు ముఖము మాఱిపోయెను. వర్ణింప నలవికాని తేజ మాతని నావరించెను. భగవత్కళ ప్రత్యక్షమగుచుండెను. బ్రాహ్మణుఁ డాతనినిఁ జూచి యాశ్చర్యపడెను. ఏమి చేయుటకును దోచలేదు. భక్తుల నవమానించుట మహాపాపమని తలంచెను. వెంటనే యాతఁడు రోహి

దాసు పాదములపైఁబడి రక్షింపుమని వేడికొనెను. రోహిదాసా బ్రాహ్మణునకు వినయముతో "బ్రాహ్మణోత్తమా! నీవు నాకు మ్రొక్కఁగూడదు. పరమేశ్వరుఁడు నీకు జ్ఞానము ప్రసాదించినందులకు సంతోషింపుము" అని పలికెను. భూసురుఁడా రోహిదాసు భక్తిని యనేకవిధములఁ గొనియాడి యాశీర్వదించి చనెను.

భక్తిపరులకు కులముతోఁ బనిలేదు.

## 10. లోపాముద్ర.

విదర్భదేశాధీశ్వరునకు లోపాముద్రయను నొకపుత్రికారత్నము కలదు. ఆమె మిగుల సౌందర్యవతియైయుండుటయే గాక సమస్తసుగుణములతో విలసిల్లుచుండెను. శాంతము, భూతదయ, సజ్జనసేవ, హరిభక్తి మొదలగు సద్గుణములామె యందుండెను. ఆకన్యకామణికి యుక్తవయస్సు వచ్చియుండుటచే వివాహముఁజేయుటకుఁ దండ్రి నిశ్చయించి వరునిఁగూర్చి యాలోచించుచుండెను. ఇట్లుండ నొకనాఁడారాజేంద్రునిమందిరంబునకు నగస్త్యమునీంద్రుఁడేతెంచెను. ఆతఁడతనిని భక్తితోఁబూజించి రత్నపీఠమునఁ గూర్చుండఁ బెట్టి "మహాత్మా! నీదర్శనభాగ్యము నాకు లభించుటవలన

నాజన్మము పావనమయ్యెను. నీయభీష్ట మెట్టిదో తెలుపుము. శక్తియున్నచోఁ దీర్చెద" నని వినయపూర్వకముగఁ బలికెను. అందులకా మునీంద్రుఁడు "రాజేంద్రా! నీవు ధర్మపరుఁడవు. సత్యవ్రతుఁడవు. దానపరుఁడవు. అందుచేత నినొక్క విషయము యాచింపవచ్చితిని.నీకోరికఁదీర్చెదనని నీవుచెప్పినమాట తప్పవలదు నాపితృదేవతలొకనాఁడు నాకుఁగలలోఁ ప్రత్యక్షమై "పుత్రా! నీ వనేకసంవత్సరములనుండి బ్రహ్మచర్యాశ్రమమందే యుండుటచే మాకుఁ బుణ్యలోకము కలుగకున్నది. పుత్రులు లేనివారికి సద్గతి యుండదని ధర్మశాస్త్రములు చెప్పుచున్నవి. వంశమున నేడవతరమున నైనఁ బుత్రుఁడు పుట్టకున్నచో మొదటి తరము పురుషునకు సద్గతికలుగదు; నీవు మా కేడవ తరమువాఁడవు. కావున నీవు వివాహమాడి మమ్ముద్ధరింపు" మని పలికిరి. అందుచేత నీపుత్రికయగులోపాముద్రను వివాహమాడఁదలంచి వచ్చితిని." మునీంద్రునిమాటలు వినిన యంతనే నృపాలుఁడేమియు మాటలాడలేకపోయెను. ప్రక్కనున్న మంత్రితో నతఁడు రహస్యముగా "మంత్రీ! వింటివా! ఎప్పుడు నరణ్యమందేవసించుచుఁ గందమూలమెక్కుచుఁ దపోవృత్తి నుండు నీజడదారికి నాపుత్రికనిచ్చి పరిణయము సేయవలయునఁట!" యని యసూయభావముతోఁ బలికెను. అమాత్యశేఖరుఁడా నరపాల చంద్రునితో "ఈతఁడు మహామహిమగల తాపసి. ఈతనియభిప్రాయము లోపాముద్రకెఱింగింపు"డనెను.

అంతట రాజు తనపుత్రికయొద్ద కేగి యగస్త్యుని కోరికయుఁ దనకది యిష్టముగా లేని సంగతియు దెలిపెను. అందులకు లోపాముద్ర తండ్రి కిట్లు పలికెను.

"తండ్రీ! అగస్త్యమహామునీంద్రుఁడు సామాన్యుఁడు కాడు. ఇంద్రకన్యున్నుఁడను భూచారుని నేనుగుగాఁ బుట్టునట్లు శపించెను. సముద్ర జలమంతయు దోసిటఁబట్టి గుటుక్కునఁ ద్రావెను. వింధ్యపర్వత గర్వం బుడిపి, సూర్య చంద్రులకు స్వేచ్ఛాసంచారము గలిగించెను. ఆతఁ డలిగెనేని లోకము లన్నియు గంపమొందును. మన పురాకృతి పుణ్యావశమున, ప్రార్థింపకయే మన గృహమున కాతఁడు వచ్చెను. కావున సంశయింపక న న్నాతనికిచ్చి వివాహముచేయుము. ఆతఁడు సన్యాసియని తలంపవలదు. పూర్వము మహారాజులు కొందఱు తమపుత్రికలను మునీంద్రుల కిచ్చి వివాహములు జేసి యుండిరి. మాంధాతృఁడను మహారాజున కేబదిమంది పుత్రిక లుండిరి. ఒకనాడు సౌబరి యను మునీంద్రుఁ డాతని కడకువచ్చి వారిలో నొకకన్యను దనకిచ్చి వివాహము జెయుమని కోరెను. అందుల కా రాజు చింతాక్రాంతుఁడై "మునీంద్రా! నాపుత్రికలనందఱ నీకుఁ జూపెదను. అందులో నెవ్వారైన నిష్టపడినచో నీవు కోరినట్లు పరిణయంబొనర్చెద" నని బదులు చెప్పి, యమ్మునీంద్రుని నంతఃపురమునకుఁ గొనిపోయి పుత్రికలకు మునియభిలాషఁ దెలిపెను. ఆకన్యక లందఱును సౌబరినే

వివాహమాడుదుమని చెప్పిరి మాంధాతృ డేబదుగురు పుత్రికలను సౌబరికేయిచ్చి పెండ్లి చేసెను."

లోపాముద్ర యిట్లుచెప్పఁ విని తండ్రి యామెను నగస్త్యునకిచ్చి పెండ్లిజేసెను. పెండ్లియైనవెంటనే యగస్త్యుఁడామెను దన యాశ్రమమునకుఁ దోడ్కొనిపోయెను. లోపాముద్ర రాజపుత్రికయయ్యును, గర్వమింతయు లేక భర్తకను గుణముగ నారచీరలనే ధరించుచు, గందమూలములనే తినుచు, భర్తయే పరమేశ్వరుఁడని తలంచి భక్తితో మెలంగుచుండెను. అగస్త్యుఁడు భార్యయొక్క సౌశీల్యమునకు సంతసించెను. ఇట్లుండ నొకనా డగస్త్యుఁడు భార్యనుజూచి "సతీమణీ! నాకుఁ ద్రాగుటకుఁ గావలసినన్ని పాలు నొసంగఁగలవా?" యని యడిగెను. అందులకు లోపాముద్ర భర్తనుంగాంచి "సముద్రోదకమంతయు ద్రావిన మీకు, నేను దాహముదీర్చుకొనుటకై క్షీరము నొసంగఁగలనా! అయినను మీదయకుఁ బాత్రురాలయిన నేనందులకు బ్రయత్నించెద" నని పలికి, యొక పాత్రలోఁ బాలుపోసి, పరమేశ్వరుని ధ్యానించి యాతని ముందుఁ బెట్టెను. అగస్త్యుఁ డెన్నిపాలు త్రాగుచుండినను పాత్రలోఁ దఱుగకయుండెను.

మఱియొకనాఁడు యగస్త్యాశ్రమంబునకు విపులుండను ముని తన భార్యయగు విపులాంగితో వచ్చెను. ఆ మునిదంప

తులను నగస్త్యుఁడును, లోపాముద్రయు ననేకవిధంబులఁ బూజించి తమయాశ్రమమున మూఁడుదినంబు లుండఁగోరిరి. విపులుం డందులకు సమ్మతించెను. విపులాంగి లోపాముద్ర గుణము బరీక్షించుట కామెంగాంచి "అమ్మా! నీవు రాజపుత్రికవు. దివ్యాభరణములను, నమూల్యవస్త్రములను ధరింపవచ్చును. అట్టివానినొల్లక ఈనారచీరల నేల ధరించుచుంటివి? ఒకవేళ మాబోటివారెవరైన నిన్నేమయిన నడిగినచో నేమి యొసంగెద" వనెను. లోపాముద్ర యామెమాటలకు "విపులాంగీ! ఈవిషయమున నీవు సంశయింపనక్కఱలేదు. నా ప్రాణేశ్వరునిదయవలన నన్నియు నున్నవి. ఎవ్వరేది కావలసిన, నది యొసంగఁగలను. నీకేమికావలయునో కోరుము. ఇచ్చెద" నని బదులు చెప్పెను. విపులాంగి యామెను కొన్ని దివ్యాభరణముల నిమ్మని యడిగెను. లోపాముద్ర సంతోషించుచు నాశ్రమముననున్న యొకచెట్టుచూపి, "దానికొమ్మలకు ననేక భూషణములఁ దగిలించియుంచితిని: అందు నీకుఁ గావలసినవి తీసికొమ్మని పలికెను. విపులాంగి చెట్టువద్దకుఁబోయిచూడఁగా నదియంతయు భూషణములతో నిండియుండెను. విపులాంగి లోపాముద్ర మహిమంబున కద్భుతమునంది యనేక విధముల నుతించెను.

పతివ్రతల కెన్నటికిని గొఱఁతగలుగదు.

# చెఱపకురా చెడెదవు!

పూర్వకాలంబున ఉజ్జయనీ నగరంబున ధనగుప్తుండు, వర్ధమానుండు అను నిద్దరు వైశ్యులుండిరి. వారిరువురు వ్యాపారముఁజేయుటకు నిశ్చయించి అందు వచ్చిన లాభమును సమముగా పంచుకొనుటకు ఒప్పుకొనిరి. చీనపుదేవి యను నొక రేవునందొక మెత్తు యినుమునకు రెండు ఎత్తులు బంగారము యిచ్చెదరని వారువిని వర్ధమానుడు జబ్బుపడుటచే, వారి యిరువరి యొడలను యినుముతోసహా ఆ ద్వీపమునకు ధనగుప్తుండొక్కడే తీసికొనివెళ్ళి దానికి బదులుగా నాలుగు ఓడల బంగారమును తీసికొనివచ్చుచు, తన స్నేహితునికివ్వవలసిన రెండుఓడల బంగారమును ఆతనికిచ్చుట మనస్సొప్పక, తన గ్రామ సమీపముననున్న యొకరేవులో ఆ యిరువురి బంగారమంతయు పాతిపెట్టి యింటికివెళ్ళెను. వర్ధమానుండు తనస్నేహితుని రాకకై యెదురుచూచుచు ఆతనినిగని యోగక్షేమముల నడిగి, తనకురావలసిన బంగారమును యిమ్మని ధనగుప్తు నడిగెను. ఆతడు అందులకై విచారించుచున్నటుల నటించుచు, "చీనపుదేవి యందు ఒకరియింట ఆ యినుమంతయు పాతిపెట్టగా దైవవశమున అచ్చటనున్న యెలుకలు దానినంతయు తినివేసినందున వెనుకకువచ్చితి"నని చెప్పదొడంగెను. వర్ధమానుండు తనస్నేహితుడు తనకు చేసిన మోసమును తెలిసికొని విచారమును మాని తనస్నేహితునితో మునుపటికన్న ఎక్కువస్నేహముగా నున్నటుల నటించుచు, తగిన సమయముకొరకు నిరీక్షించుచుండెను.

ఇట్లుండ ఒకనాడు వర్థమానుడు తన స్నేహితుడైన ధనగుప్తుని యింటికి వెళ్ళి ఆతని ముద్దుల కుమారుని తనయింటికి తీసికొని వచ్చి, తనయింటిలో యెచ్చటనో దాచియుంచి వీధి అరుగుపై గూర్చుండెను. ధనగుప్తుని దాసి, అరుగుమీద కూర్చొనియున్న వర్థమానునికడకు వచ్చి, తనయజమానుని చిన్నికొమరుని యివ్వవలసినదని అడుగగా, వర్థమానుండు "ఆ బాలుని నే నెత్తుకొని ముద్దాడుచుండ ఒక గద్దవచ్చి నెత్తుకొని పోయె" నని చెప్పెను. ఆసంగతి దాసి తన యజమానునికి దెలుప, నాతడు మండిపడి ఆ సంగతి ఆయూరి రాజుగారితో ఫిర్యాదు చేసెను. రాజు వెంటనే వర్థమానుని రప్పించి యడుగగా ఆత డిట్లు ప్రత్యుత్తరమిచ్చెను. "అయ్యా! ఈతడు నా యొద్దనుండు ఒక యోడయినుము తీసికొనివెళ్ళి, దానికివచ్చు రెండుయోడల బంగారమును యివ్వవలసినదని నే నడుగ, అందులకు యీాతడు యినుమును భూమిలో పాతిపెట్టియుండ అచ్చట నివసించు యెలుకలు దాని నపహరించినందున నివ్వలేదని చెప్పెను. అందువలన నే నీతనిబాలుని ముద్దాడుచుండ, ఒక గ్రద్ద వచ్చి ఆపాపను యెత్తుకొనిపోయెనని చెప్పుటలో నేమి యసత్యమున్నది?"

అప్పుడు రాజు ధనగుప్తుండు చేసిన మోసమును తెలిసికొని అతనిని బంధించవలసినదని తనభటులకు ఆజ్ఞాపించెను. వెంటనే వారు ఆతని పట్టుకొని బాధించుచుండ ధనగుప్తుడు

జరిగినసంగతి యంతయు సవిస్తరముగ చెప్పెను. అంతట రాజు ధనగుప్తునివద్ద నున్న బంగారమును తెప్పించి వర్ధమానుని భాగమును ఆతనికిచ్చివేసి మిగిలిన భాగమును, ఆతని యితర ధనమును తన స్వాధీనముచేసికొని, ధనగుప్తుని దేశమునుండి వెడలగొట్టించెను.

బాలులారా! చూచితిరా! ధనగుప్తునిగతి యేమాయెనో! వర్ధమానుని మోసముచేయదలచెను; గాని లీలామానుష విగ్రహుండగు భగవంతుడు దుష్టులయొక్క మోస కృత్యములను కనుగొని వారిని శిక్షించి సత్యవంతులను రక్షించుచుండును 'చెఱపకురా చెడెద'వను ఆర్యోక్తి ననుసరించి ఒకరిని మోసముచేయువారు తిరిగి వారే మోసపోవుదురు.

# మేఘవాహనుఁడు.

కాశ్మీరరాజుల వంశములోఁబుట్టిన గోపాదిత్యుఁడను నతఁడు తనపూర్వులు కోలుపోయిన కాశ్మీరరాజ్యమును సంపాదింపదలఁచి, గాంధారదేశపురాజు నాశ్రయించియుండెను. అకాలమున, నతనికి సర్వశుభలక్షణ సమన్వితుఁడగు పుత్రుఁ డొకఁ డుద్భవించెను. ఆతడే మేఘవాహనుఁడు. ఆతఁ డన్ని విద్యల నభ్యసించి, బలపరాక్రమ ధైర్యగాంభీర్యాది శూర

లక్షణాములను కలిగియుండెను. ఇతని యోగ్యతలు నాలకించిన కతఁడు, దము 'కితఁ డెన్నడు రాజగునా' యని కాశ్మీర దేశపు ప్రజలు తలఁచుచుండిరి.

ప్రాగ్జ్యోతిష పురాధీశ్వరునియొద్ద చక్రవర్తియగు వానికి గాని సీసనీయని గొంగోకటి యుండెను. అది సీడనిమ్పు వానికి తనకూతునిచ్చి వివాహముఁ జేసెదనని యారాజు ప్రకటించెను. మేఘవాహనుఁడు తండ్రిచే బ్రేరేపింపఁబడి, యా స్వయంవరమున కేగి, యాకన్యను వివాహమాడెను.

ఇట్లుండ కొలఁది కాలంబునకు కాశ్మీర ప్రజానాయకులు, మంత్రులు, గాంధారదేశమునందున్న, మేఘవాహనుని దోడ్కొని వచ్చి పట్టాభిషిక్తుం జేసిరి. ఆ సమయమున మేఘవాహనుఁడు మాంసమునమ్మి జీవించువారల కమితముగ ధనమునొసంగి, జంతుహింస చేయవలదని దేశమందంతటను జాటించి యజ్ఞములందు సయితము పిండితో పశువును జేయించుచుండెను. అతఁడు ప్రజారంజకంబుగ రాజ్యమునేలుచు, మేఘవనమను అగ్రహారమును, మఠములను, గ్రామంబులను గట్టించి భూసురుల కొసంగెను. ఇతని పట్టపుదేవియగు అమృతప్రభ 'అమృతభవన' మను విహారమును, తన తండ్రియగు స్తున్పుని పేర 'లోస్తాన్పా' యను స్తూపములను గట్టించెను. రాజునకింకొక భార్యయగు యూకదేవి యద్భుతాకారమగు విహార మొకటికట్టించి, యందు

సగము బౌద్ధభిక్షులకును, మిగిలిన సగము కుటుంబములతో
కాపురముండు గృహస్థులకును యిచ్చెను. ఇంద్రదేవియును,
వేజ్యోకరాణి ఇంద్రదేవీభవనమును, ఖాందనాను మొదలగు
రాజదేవేరులు తమ పేరుల ననేకవిహారములఁ గట్టించి, కీర్తివడసిరి.

ఇమ్మహారాజేంద్రుఁ డొకప్పుడు జంతుహింస మాని
పించు తలంపున, దిగ్విజయార్థ మఖిల దేశములకు జని, తన
పరాక్రమంబున రాజుల నెల్లర నహింసాపరులుగా జేసి, యొక
తాళీవనంబున విడిసి, తన గుడారమున శయనించి ద్వీపముల
గెలువ నాలోచించుచుండ "మేఘవాహనుని రాజ్యకాలమున
గూడ, నేను బలి నొసంగబడఁబోవుచున్నాను" అను దీన
వాక్యము వినఁబడెను. కృపాసముద్రుఁడగు మేఘవాహనుఁడు
ఆయుధమును ధరించుటకయినను తోపక, గొడుగుమాత్రము
చేతబట్టుకొని ఆ దీనవాక్యము వచ్చిన దిక్కునకుఁ బోయెను.

కొంతదూరంబున దేవాలయంబునఁగల చండిక కాహా
రముగ బలినీయఁబోవు దిక్కులేని మనుజు నొకనిని, బలినీయ
నుంకించి ఖడ్గమును బట్టియున్న శబరుని అదలించి, "శబర
రాజా! వీని నిట్లు నిష్కారణముగ జంపఁదలచుటకు కారణ
మేమి?" అని యడిగెను. "బాలుఁడగు నాకుమారుఁడు,రోగ
ముచే బాధపడుచు చావనున్నాడు. వీని నీదేవికి బలినిచ్చితి
నేని నా కుమారుఁడు జీవింపగలఁడు. అట్లుగాకున్నఁ నాబంధు
మిత్రులనేకులు నశింతురు. దిక్కులేని యీమనుని చావునకు

దుఃఖించువారయినను లేరు. కావున నాప్రయత్నమున కభ్యంత
రము కలిగింపకుము” అని శబరుఁడనెను. “అట్లయ్యేనేని నన్ను
బలి నిచ్చితివేని నీకుమారుఁడును, దిక్కులేని యీమనుజుఁ
డును జీవింపఁగలఁడును. అట్లుచేయుము” అని రాజనెను.
“రాజేంద్రా! దయాధిక్యతచేత నీకు మతిచెడినట్లున్నది. నీవు
జీవించియుంటివేని లోకమున కుపకారివయి యుండఁగలవు నా
కుమారుఁడు జీవించెనేని, నా బంధువులెల్ల రానందింతురు.
ఈ మనుజుని జీవితమున కాశపడువారలెవరు? ఇతని మరణ
మునకు గుందువా రెవరు? భార్యాపుత్ర మిత్రాదులతో సమస్త
సౌఖ్యము లనుభవించు శరీరమును తృణప్రాయముగ జూచెద
వేల? నీ వీ సాహసమును మానుము” అను శబరుని మాటల
నాలకించి “నాయత్నమునకు నీవు సమ్మతింపవేని నేనే కంఠ
మును నఱికికొనియెదను.” అని వీరావేశుఁడయి శబరునిచేతి
ఖడ్గమును లాగికొని కంఠ ము త్తరించుకొనఁబోయెను. అప్పుడా
గుడియు, చండీయు శబరుఁడును వధ్యుఁడును, మాయమయిరి.
మేఘవాహనునిపై పూలవాన కురిసెను. ఒక దివ్యపురుషుఁడు
మేఘవాహనుని చేతిఖడ్గమును బట్టుకొని “ఓ కరుణానిధీ!
నేను వరుణుఁడను. నీచేతనున్న గొడుగు నాది. పూర్వము
నరకాసురుఁడు దీని నపహరించెను. దానిని నీ వలన గైకొను
తలంపున నీధైర్యసాహసాదులు పరీక్షింపనెంచి, మొదట
నీమాయ గల్పించితిని. నీయట్టి దయామయు లీరేఁడులోకం
ముల గలరా? ఈ గొడుగును నాకిమ్ము” అని యడిగెను.

మేఘవాహనుఁడు గొడుగునిచ్చి, యాతనికి సాష్టాంగ నమస్కారము జేసి "వరుణదేవా! నేను సమస్త భూమండలంబును జయించితిని. ద్వీపాంతరముల జయించు తలంపుననున్నవాఁడ. ఆ ప్రయత్నమునకు సముద్రము దాటుట మొదటిపని. కావున నాకును, నాసైన్యమునకును, సముద్రము దారినిచ్చునట్లు వరమిమ్ము" అని ప్రార్థించెను. వరుణదేవుఁడు ఆ వరమునిచ్చి యదృశ్యుడయ్యెను.

ఆవల, మేఘవాహనుఁడు లంకానగరముపై దండెత్తి సైన్యసమేతముగ సముద్రమునఁ బ్రవేశించెను. సముద్రము నీటిమధ్య మార్గము కనఁబడెను. సైనికులందఱు నాశ్చర్య నిమగ్నులయి యామార్గంబున సముద్రంబుదాటి, లంక కుత్తర తీరంబున గుడారములు వేయించి, సైన్యముతో నందు విడిసెను. విభీషణుఁ డాతని రాకవిని, మేఘవాహనుని దగ్గఱకువచ్చి మిక్కిలి ప్రీతితో గారవించెను. వా రిరువురును, కొంతసేపు సల్లాపము సలిపినపిదప విభీషణుఁ డా రాజపుంగవుని లంకకు దీసికొనిపోయి, యచ్చట మనుష్యు లెఱుఁగని పదార్థముల భుజింపఁజేయుచు, గొన్నాళ్ళు తనయింట నిలిపెను. మేఘవాహను డచ్చటి రాక్షసుల కహింసామార్గమును బోధించెను. వారప్పటినుండియు, జీవహింసమాని మాంసభక్షణము విసర్జించిరి. విభీషణుఁ డు, రాక్షసశిరఃప్రతి కుఁ ుగల ధ్వజ

ములు మేఘవాహనున కర్పింపఁ వానింగొని విభీషణునాజ్ఞ గైకొని కాశ్మీరము ప్రవేశించెను.

మేఘవాహనునియాజ్ఞ శిరసావహించి మానవకోటి యొక్కటే జీవహింసమానుటగాక, నీటియందలి జలచరములును, వనములందు సింహశార్దూలాది క్రూరమృగములును, ఆకాశము నందలి గ్రద్దలు మొదలగు పక్షులును, జీవహింస మానినవని చెప్పనొప్పును.

ఇట్లుండ గొంతకాలమునకు, ఒక బ్రాహ్మణుఁడు వ్యాధిగ్రస్థుడగు కుమారునిఁదీసికొని రాజసన్నిధికివచ్చి "ఓ రాజా! నీయాజ్ఞ నతిక్రమింపఁజాలని కారణమున దుర్గకుఁ బలినీయకుండుటచే, నాకుమారుఁడు చావబోవుచున్నాఁడు. బ్రాహ్మణప్రాణమందును, జంతుప్రాణమందును యేది యధికమో యోచింపుము. తపోవంతుల సయితము చంపి, బ్రాహ్మణప్రాణముల రక్షించిన శ్రీరామాదిరాజు లిప్పుడు లేకపోయిరి గదా! అని యేడ్చుచు, రాజును నిందించుచు, నచ్చటనే యుండెను. మేఘవాహనుఁడు, తనప్రతిజ్ఞ విడిచి జీవహింసకు ఇష్టపడజాలక బ్రాహ్మణకుమారుని బ్రతికించుటకు సమర్థత లేక, తనశరీరమును దుర్గకొసఁగినచో, తనప్రతిజ్ఞ విడువకనే బ్రాహ్మణపుత్రుఁడు రోగరహితుఁడయి జీవించునని నిశ్చయించి "రేపు నీ కుపాయముఁజెప్పెదను" అని బాపని

పనిచెను. ఆ రాత్రి దుర్గాదేవి రాజోత్తమునకు స్వప్నంబున దర్శనమొసంగి, యాతని ప్రయత్నము వారించి బ్రాహ్మణ బాలుని రోగము పోఁగొట్టెను.

మేఘవాహనుడు ఇట్టి భువనాద్భుతకార్యము లనేకము జేయుచూ భరతఖండమంతకును చక్రవర్తియయి, గొప్ప యశము నందెను.

---

